## చైర్మన్‌తో ముఖాముఖి



నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**ప్రశ్న : తెలంగాణాలో అన్ని కులాలకు వృత్తుల వారీగా పని ముట్లు ఇస్తున్నారు దీన్నెలా చూడాలి... బిసి లంటే గొర్రెలు, బర్రెలకే పరిమితమా...**

జవాబు : తెలంగాణాలో నే కాదు.. ఆంధ్రప్రదేశ్‌లో కూడా అదే పరిస్థితి చేతివృత్తుల వారిని ఓట్లేసే యంత్రా లుగానే పాలకులు చూస్తున్నారు. వారికేవో తాయిలాలు ప్రకటించడం వరకే పరిమితమై పోతున్నారు. అలా కాకుండా వారిని రాజకీయశక్తిగా ఎదిగేలా చేయాల్సిన బాధ్యత రాజకీయ పార్టీల పైనే ఉంది. కానీ ఏ రాజకీయ పార్టీ కూడా అటువైపుగా ఆలోచించడం లేదు. అందుకే ప్రభుత్వాలు బిసిలను ఎదగకుండా చేస్తున్నాయి. యాద వులు, కుర్మలకు గొర్రెలిస్తున్నట్లు తెలంగాణ ప్రభుత్వం ప్రకటించింది. ఇక బెస్తవాళ్లకు చేపల చెరువుల్లో చేపలు పెంచుకునేందుకు చేపల సరఫరా చేస్తామంటుంది. ఒడ్లోల్లకు వడ్రంగి సామాన్లు, కమ్మర్లకు కమ్మరి పనిముట్లు, మంగలివారికి మంగలిషాపులు ఇలా ఎవ్వరి వృత్తి పరమైనవి వారికి అందజేస్తామంటున్నారు. కానీ ఇప్పటికే బిసిలు, కుల వృత్తుల వారు చైతన్యం అయ్యారు. గొర్రెలు, బర్రెలు మాకొద్దంటున్నారు. రాజ్యాధికారంలో వాటా కావాలని అడుగుతున్నారు. అయితే ఇది ఇంకా ఉద్యమంగా రావాల్సిన అవసరం ఉంది. ఆ వైపుగా ముందుకు సాగాలంటే బిసి కులాల్లో ఐఖ్యత రావాలి. సమాజంలో 56 శాతానికి పైగా ఉన్న బిసి కులాలకు రాజకీయంగా దక్కాల్సిన వాటా దక్కడం లేదు. ఎమ్మెల్యే, ఎంపి పదవులు దరి చేరడం లేదు. స్థానిక రిజర్వేషన్ల మూలంగా ఎంపిటిసి, సర్పంచ్, వార్డు మెంబర్ల పదవులు వస్తున్నా అవి కూడా జనాభాకు తగ్గట్టుగా రావడం లేదు.

రాష్ట్ర ప్రభుత్వ బడ్జెట్‌లో యాభై శాతానికి పైగా బలహీన వర్గాలకే కేటాయించాలి. వారి అభివృద్ధి కోసం ఖర్చు చేయాలి. కానీ ఆ పని ప్రభుత్వం చేయడం లేదు. ఏడిచే పిల్లాడి చేతిలో చాక్లేట్‌లు పెట్టినట్లు బలహీనవర్గాల వారికి గొర్రెలు, బర్రెల ఆశచూపిస్తున్నది. ఇది ఆమోదయోగ్యం కాదు. బలహీన వర్గాలు రాజకీయంగా ఎదగాల్సిన అవసరం ఉంది. అందుకోసం కులాలకు అతీతంగా బిసి లందరు ఏకం కావాలి. మా వృత్తులు వేరైనా మేమంతా ఒక్కటే మా కులం ఒక్కటే బిసి కులం అంటు నినదించాలి. బిసిల ఓట్లు బిసిలు వేసుకునే విధంగా చైతన్యం వస్తే ఎవ్వరు మనకు పదవులు ఇవ్వాల్సిన అవసరం ఉండదు. బిసిలే అగ్ర వర్ణాలకు పదవులు ఇచ్చే స్థాయి వస్తుంది. అందుకే ఆ వైపుగా బడుగు బలహీనవర్గాలు కృషి చెయ్యాలి.

**ప్రశ్న : యూపి ఎన్నికలు ఎలా ఉంటాయను కుంటున్నారు.**

యూపి ఎన్నికల్లో ఫలితాలు ఇప్పుడే చెప్పలేం. యూపీ వరకైతే అఖిలేష్ మంచి నేత ఆయన్ను ఎన్నుకునేందుకు యువకులు ఉత్సాహం చూపుతున్నారు. అయితే ఆయన కాంగ్రేస్‌తో కలవడం వల్ల నష్టం జరుగుతుందని కొందరి అంచనా.. బిజెపి బలం పెరిగినా కూడా యూపిలో బిజెపి కి సరైన నేత లేదు. అందుకే ప్రచారం మోదీ మీదుగానే సాగుతున్నది. అమిత్‌షా ఏదో చక్రం తిప్పాలని చూస్తున్నా అక్కడి ఓటర్లు ఏమి ఆలోచిస్తున్నారోఆయనకు కూడా అంతుచిక్కడం లేదు. యస్‌పిలో లుకలుకలను ప్రజలు అంతగా పట్టించుకున్నట్లు లేరు. ఇక బిఎస్పీని మాయావతి ముందుకు తీసుకుపోవడంలో వెనకపడ్డట్లు కనపడుతున్నది. ఆ పార్టీ ఓటు యస్పీకి వ్యతిరేకమైన ఓటు కాబట్టి అది బిజెపికి పడే అవకాశం ఉంది. ఒకప్పుడు బిజెపి పక్షాన ఉన్న వైశ్యులు, బ్రాహ్మణులు బిఎస్పీకి వెళ్లారు. అయితే వారు తిరిగి బిజెపి పక్షాన చేరుతున్నట్లు కనపడుతున్నది. ఒక వేళ బిజెపి పెద్ద పార్టీగా అవతరించినా ప్రభుత్వ ఏర్పాటు కోసం బిఎస్పీ పైనే ఆధారపడాల్సి రావచ్చు. అప్పుడు ఎలా ఉంటుందో చూడాలి. ఇప్పటి కిప్పుడు అంచనా వేస్తే బిజెపి పెద్ద పార్టీగా అవతరించే అవకాశాలు కనిపిస్తున్నాయి.

**ప్రశ్న: తిరుమలేషునికి కేసిఆర్ ప్రభుత్వం నగలు ఇవ్వడం పట్ల విమర్శలొస్తున్నాయి. దేవుడికి నగలివ్వడం తప్పా.... కుటుంబ సమేతంగా దేవుని వద్దకు వెళ్ళడం పై కూడా విమర్శలు చేస్తున్నారు. దీన్నెలా చూడాలి.**

**జవాబు :** అన్ని మతాలను సమానంగా చూడటంలో కేసిఆర్ గొప్పతనం ఉంది. తెలంగాణ ఉద్యమం సందర్భంగా ఆయన మొక్కిన మొక్కులు తీర్చు కోవడంలో ఎంతమాత్రం తప్పు లేదు. ముస్లిం, క్రిష్టియన్ మతస్థులకు కూడా కేసిఆర్ అనేక పథకాలు కొనసాగిస్తున్నారు. హాజ్ పోయేవారికి, జెరుసెలం పోయేవారికి కూడా ప్రభుత్వం వైపు నుంచి సహకారం అందిస్తున్నారు. అలాంటప్పుడు హిందువుల దేవుళ్ళకు ఖర్చు పెట్టడం తప్పెలా అవుతుంది. ఇది కూడా దేవాదాయ శాఖ నిధి నుంచే ఇవ్వడం హర్షించతగినదే.... దీన్ని కావాలని రాజకీయం చేయడం వల్ల ప్రతిపక్షాలు రెంటికి చెడ్డ రేవడే అవుతాయి తప్ప వాటికి ఉపయోగమేమీ ఉండదు.

ఇక కుటుంబ సమేతంగా గుడికి వెళ్ళడాన్ని కూడా రాజకీయం చేయడం తగదు. దేవుని వద్దకు ముఖ్యమంత్రి హోదాలో వెళుతున్నపుడు తన కుటుంబ సభ్యులను తీసుకుపోవడంలో తప్పేమీ లేదు. దేవుడికి పూజలు చేసేప్పుడు శ్రీమతి పక్కనుండటం ఆచారం. సంప్రదాయం దాన్ని కాదనలేము. కేసిఆర్ గురించి ఆలోచిస్తే ఆయన అన్ని మతాలను సమానంగానే చూస్తారు. ఆయన అందరు దేవుళ్ళను విశ్వసిస్తారు. గుడిని గుడిలో లింగాన్ని మింగే నేతలకంటే దేవుడికి ఏదో ఒకటి చేయాలన్న తలంపు ఉండే నేతలే నయం కదా.... కేసిఆర్ స్వయంగా భక్తుడు కావడం, పాప, పుణ్యాల పైన ఆయనకు నమ్మకం ఉండటంవల్ల తప్పులు చేయడానికి వెనుకడుగు వేస్తారు. ఇక ప్రభుత్వం మొక్కులు చెల్లించవచ్చా అనే ప్రశ్న సరైంది కాదు. మనదేమీ నాస్థిక ప్రభుత్వం కాదు. దేవుడు లేడ నడానికి... కష్టమొచ్చినపుడు విశ్వాసమున్న దేవునికి ఎవరైనా మొక్కుతారు. ఆ మొక్కులు తీర్చుకుంటారు. అలాగే కేసిఆర్ కూడా తెలంగాణ వచ్చి, తన ప్రభుత్వం వస్తే ప్రభుత్వ పరంగా మొక్కులు తీర్చుకుంటానని మొక్కి ఉంటారు. అందుకే ఆయన మొక్కులు చెల్లిస్తున్నారు. ఇందులో ఎక్కడా తప్పు కనిపించడం లేదు.

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

## లెజెండ్



ఏప్రిల్ 15, 1452 లియోనార్డో డావిన్సీ జన్మించాడు. మరణం మే 2, 1519. ఇటలీ కు చెందిన ఒక శాస్త్రజ్ఞుడు, గణితజ్ఞుడు, ఇంజనీర్, చిత్రకారుడు, శిల్పకారుడు, ఆర్కిటెక్ట్, వృక్ష శాస్త్రజ్ఞుడు, సంగీతకారుడు మరియు రచయిత. ఇతడు చిత్రీకరించిన చిత్రాలలో ప్రసిద్ధి చెందినది మొనాలిసా చిత్రం. డావిన్సి తల్లిపేరు రజెష్కాటెరిన్స్. 1469 లో ఈయన తండ్రి ష్లోలెంన్స్ కు వెళ్లిపోయారు. ఈ కారణంగా డావిన్సీ కొంతకాలం పాటు బాబాయి వరస అయ్యే వ్యక్తి దగ్గర ఉండేవాడు.

# అసమాన ప్రతిభావంతుడు లియోనార్డో డావిన్సీ

14 ఏళ్ళ వయస్సు నాటికే మోడలింగ్‌లో డావిన్సి ఎంతో ప్రతిభ కనబరిచాడు. ఈయనను ఆంద్రియా డెల్ వెర్రాచివో శిల్పాచార్యునివద్ద చేర్పించాడు డావిన్సి తండ్రి.30 యేళ్ళ వరకు డావిన్సి ఫ్లొరెన్స్‌లోనే ఉండి ఎన్నో విషయాలు తెలుసుకోగలిగారు. కానీ ఆర్జన మాత్రం యేమీ ఉండేది కాదు. 1482 లో డావిన్సీ మిలాన్ రాజుకు తన గురించి తెలియ జెప్పుకున్నాడు. ఫలితంగా ఈయన మిలిటరీ ఇంజనీరింగ్ కాగలిగారు. ఎన్నో రకాల యుద్ధ పరికరాలను రూపొందించారు. రకరకాల ఆయుధాలను తయారు చేసాడు. ఈయన వీధులు, కాలవలు, చర్చిలు,గుర్రపు శాలలు, రాజ ప్రాసాదాలు- ఎలా ఉండాలో చెబుతూ వాటికి ప్లానులు వేసేవాడు. అంతేకాదు 1495లో ప్రపంచ ప్రసిద్ధి చెందిన లాస్ట్ సప్పర్ చిత్రాన్ని మొదలుపెట్టి 1497లో పూర్తి చేశాడు.

1499లో డావిన్సీ వెనిస్ నగరం చేరుకున్నాడు. అప్పుడు టర్కీతో యుద్ధం జరుగుతూ ఉండింది. ఆ యుద్ధ సమయంలో ప్రత్యర్థులను కొట్టడానికి కావలసిన సామాగ్రి గురించి, ఆత్మ రక్షణ కోసం ఉపయోగించవలసిన వస్తువుల గురించి, డావిన్సి ఎంతో విశదంగా తెలిపారు. కాని ఆయన ఆలోచనలు చాలా ఖర్చుతో కూడు కున్నవని ఆచరణలో పెట్టలేదు. ఖర్చు విషయం తప్పిస్తే ఈయన చెప్పినవాటికి ఏవీ సాటిరావని చెప్పవచ్చు.

డావిన్సీ 1500లో మళ్ళీ ఫ్లొరెన్స్ చేరుకున్నాడు. 1503లో విశ్వ విఖ్యాతమైన మొనాలిసా పెయింటింగ్ మొదలు పెట్టాడు. ఈ పెయింటింగ్ పూర్తి కావడానికి మూడు సంవత్సరాలు పట్టింది. అంతవరకు ఆ మోడల్ గర్ల్ వస్తూ పోతూ ఉండేది. ఈ పెయింటింగ్‌కు పూర్తి అయ్యాక ఆ చిత్రంలోని అమ్మాయి నవ్వు అతి విచిత్రంగా ఉంది. డావిన్సిని సైతం కట్టి పడేసింది. ఈ నవ్వు మాయాజాలంలా పని చేసి కోట్లాది మందిని ఆకర్షించగలిగింది. ప్రస్తుతం ఈ పెయింటింగ్. ఫ్రాన్స్‌లోని లౌవ్రె మ్యూజియంలో ఉంది.

మోనాలిసాతో సుప్రసిద్ధుడయ్యాక డావిన్సి మిలాన్ చేరుకుని 1506-1513 మధ్య కాలంలో ది వర్జిన్ విత్ చైల్డ్, పెయింట్ అన్నె వర్ణ చిత్రాలను లోక ప్రియంగా రూపొందించాడు. 1513లో రోమ్ చేరుకున్నాక ఫ్రాన్సిస్ మహా రాజు (మొదటివాడు) ప్రత్యేక అతిధిగా శేష జీవితం గడిపాడు.

ఎగిరే యంత్రాలను గురించి ఆలోచించి డావిన్సీ ఎన్నో రకాల నమూనాలను తయారుచేసాడు. విమానాల వంటివి తయారుచేశాడు.మనిషి శరీరం గురించి పూర్తి వివరాలు తెలియజేశాడు. నీటి గడియారాన్ని అందించాడు. బరువైన వాటిని తేలికగా తొలగించే క్రేన్ లను డావిన్సి ఆకాలంలోనే యేర్పాటు చేశాడు. 1519లో మరణించాడు. కొన్ని సార్లు ఒక ప్రత్యేక వ్యక్తి తను పుట్టిన తరం మొత్తం వివిధ రంగాలలో సాధించవలసిన పురోగతి యొక్క సారాన్ని తాను ఒక్కడే సాధించి ఆ పురోగతికి ఆదర్శంగా నిలుస్తాడు. యూరప్‌లో మధ్య యుగానికి అంతంలో, సాంస్కృతిక పునరుజ్జీవన శకారంభంలో పుట్టిన లియొనార్డో డావిన్సీ నిజంగా ఓ యుగపురుషుడే. జరా మరణాలు లేని మోనాలిసాకి ప్రాణం పోసిన అసమాన చిత్రకళాకారుడు. గొప్ప సంగీత విద్వాంసుడు. ఈ అనేక ముఖ ప్రతిభాశాలి కేవలం కళాకారుడు మాత్రమే కాడు. అనుపమాన శాస్త్రవేత్త, ఇంజినీరు కూడా. నాడీ విజ్ఞానంలో, శరీర నిర్మాణ శాస్త్రంలో ఇతడు ఎన్నో అమూల్యమైన విషయాలు కనుక్కున్నాడు. వస్తువుల సాంద్రతని కొలచే పరికరాలు కనుక్కున్నాడు. ఒక పక్క వెర్రితనం, వట్టి పశుత్వం అంటూ యుద్ధాలని దుయ్యబడుతూనే, దారుణమైన యుద్ధ యంత్రాలని కూడా నిర్మించాడు.

లియోనార్డో ఎప్పుడూ విశ్వవిద్యాలయానికి వెళ్లి చదువుకోలేదు. స్వాధ్యాయం, స్వానుభవం - ఇవి రెండే అతడి గురువులు. నా సృజన అంతా శుద్ధ స్వానుభవం నుండి జనించిందే, అదే నా అసలు ప్రేయసి, అని తనే చెప్పుకున్నాడు. ప్రాచీన గ్రీకు, రోమన్ నిపుణులు చెప్పిన ముక్కల్నే వల్లె వేసే తన సమకాలీనులకి భిన్నంగా సొంతగా అధ్యయనాలు చేస్తూ పోయాడు. మెదడులోని కొన్ని భౌతిక చర్యల ఆధారంగా ఇంద్రియాలు బాహ్య ప్రపంచం నుండి వచ్చే సమాచారాన్ని గ్రహిస్తాయని, అర్థం చేసుకుంటాయని నిరూపించడానికి ప్రయత్నించాడు. అంతకు ముందు గాలెన్, వెసేలియస్ మొదలైన వారు ప్రతిపాదించిన కృతక ప్రాణ శక్తుల తో సంబంధం లేకుండా మెదడు క్రియలని పూర్తిగా భౌతిక ధర్మాల సహాయంతో అర్థం చేసుకోజూసిన నాడీశాస్త్ర పురోగామి లియొనార్డో. 1452 లో, ఏప్రిల్ 15 నాడు వించే అనే ఊళ్లో జన్మించాడు లియొ నార్డో. ఈ ఊరు ఫ్లోరెన్స్ నగరానికి 20 మైళ్ల దూరంలో ఉంది. ఇరవై నిండని కుర్రవాడిగా ఫ్లోరెన్స్ కి చెందిన ప్రఖ్యాత ఇటాలియన్ శిల్పి, కళాకారుడు అయిన ఆడ్రి యాస్ దెల్ వెర్రోచియో కి చెందిన చిత్రకళా స్టూడియోలో పనికి చేరాడు. ఇరవై ఏళ్ల వయసులో చిత్రకళాకారుల సదస్సులో సభ్యుడయ్యాడు. ఆ దశలోనే లియొనార్డో వేసిన సెయింట్ జెరోమ్ చిత్తరువుని బట్టి అప్పటికే అతడికి మాన వ శరీరంలో కండరాల అమరిక గురించి చాలా క్షుణ్ణంగా తెలిసి ఉండాలని అర్థమవుతుంది. తరువాత 1480 ప్రాంతాల్లో ఫ్లోరెన్స్ నుంచి మిలాన్‌కి వెళ్లాడు. ఆ కాలంలో త్యజించబడ్డ మానవ కళేబరాల మీద పరిచ్ఛేదాలు చేసి శరీర నిర్మాణం గురించి తన జ్ఞానాన్ని పెంపొందించుకున్నాడు. ఆ అధ్యయనాలలో కళని, విజ్ఞానాన్ని అద్భుతంగా సమన్వయపరచుకున్నాడు.

చిత్రకళ కోసం మొదలుపెట్టిన జీవశరీర పరిచ్ఛేదాలు అతణ్ణి నాడీ విజ్ఞానం వైపునకి తీసుకెళ్లాయి. 1487 ప్రాంతాల్లో ఒక సారి కప్ప మీద ఒక ప్రయోగం చేశాడు. ఆ ప్రయోగాన్ని చేసిన మొదటివాడు బహుశ అతడేనేమో. ఆ ప్రయోగం గురించి ఇలా వర్ణిస్తాడు...కప్పలో వెన్నుపాములో మెడుల్లా (మెడుల్లా అబ్లాంగాటా) ని పొడిస్తే కప్ప తక్షణమే చచ్చిపోయింది. అంతకు ముందు కొన్ని ప్రయోగాలలో తల మొత్తం తీసేసినా బతికింది. గుండె, ఇతర అంతరంగ అవయవాలు, పేగులు, చర్మం మొదలైనవి తొలగించినా బతికింది. దీన్ని బట్టి చూస్తే చలనానికి, జీవనానికి మూలం ఇక్కడే ఉందని అర్థమవుతోంది.



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

# 'సీరియల్సు'

బొమ్మ కథలే లేవు!
బాల్య క్రీడలే లేవు!
బంధువులొస్తే కుశల
ప్రశ్నలు వేసే తీరికే లేదు!
పతి సేవలే లేవు!
పిల్లల బాగోగులేం పట్టవు!
బాపురే సీరియల్స్‌లో ఎన్నెన్ని
భాగాలో!?
అర్థమయ్యేలోపు ఈ జీవి
తమే అంతమౌతుందేమో!?
పూర్వజన్మలు, మరుజ
న్మలు... అంటూ...లేని,
పోని భ్రమలు కలిగిస్తూ....
చింతలేని చింతలతో చిరాకు
పడిపోతూ...
విషయం లేకుండా విసుగు
తెప్పిస్తూ...
ఏ ఇంటిలో ఉన్నా
ఆ గంటకి...
ఈ సీరియల్స్ చూడనిదే...
కలవరపడిపోతుంటారు!
సెల్‌ఫోనుల్లోనూ సీరియస్‌గా
సీరియల్ కబుర్లే!
నేరాలు నేర్పిస్తూ...
ఘోరాలు చూపిస్తూ....
కారాలు, మిరియాలు
నూరుతూ...
కాపురాలే కూల్చుతూ...
అర్థం లేని అనుమానాలు
రేకెత్తిస్తూ...
మిడ్‌నైట్ మసాలాలతో
మతులు పోగొడుతూ...
యువతను పెడదోవ
పట్టిస్తూ...
ఫ్యాషన్ ఛానల్స్‌తో
విష సంస్కృతులకు తెర
తీస్తూ...
"పట్టుకో పట్టుచీర"
అని ప్రలోభపెడుతూ...
"కట్టుకో రక్షరేఖ" అని
మాయచేస్తూ...
హింస చూపెడుతూ...
మనఃశ్శాంతిని మట్టుపె
డుతూ...
మంచికి ఎసరుపెట్టి...
చెడును సాగదీస్తూ చూపే
'సీరియల్స్' చూడటం
సిగ్గు! సిగ్గు!!

**– కిలిమి యోగేష్,**

# రన్నింగ్ వాయిస్

## పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

**–హేమంత్, మౌలాలి**

## కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.




**వింతలు విశేషాలు**

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి.వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

**–వెంకట్, గొల్లపూడి**

# 'కూని'రాగాలు

**సంతృప్తికి సమాధానం దొరకదు..!**
**మనస్సుకు వయస్సు అడ్డంకాదు..!!**

**ఊహించని మలుపులే జీవితగమనం..!**
**గతించని జ్ఞాపకమే చరిత్రల మస్తకం..!!**

**మాటలు మనసుతో పెనవేసుకోవాలి..!**
**మనుషులు స్వార్థంతో స్నేహంమానాలి..!!**

**వెలుగుతోపాటు చీకటి నీ రుచించాలి..!**
**జిలుగులలో అభివృద్ధి అంచనా తగదు..!!**

**దూరంపెరిగే కొద్దీ దగ్గర కావాలనిపించాలి..!**
**దగ్గరే ఉన్నదానికి గుర్తింపు ఇవ్వాలనిపించాలి..!!**

– కూనిరెడ్డి శ్రీనివాస్

## కోరిక

నాన్నా... నాన్నా... నాకు సన్నాయి నేర్చుకోవాలనుంది. ఒక సన్నాయి కొనిపెట్టవా? కొడుకు అడిగాడు తండ్రిని.

వద్దురా.. వేళాపాళా లేకుండా వాయిస్తే ఇంట్లో గోలగా ఉంటుంది అన్నాడు తండ్రి.

ఫర్లేదు నాన్నా... మీరంతా నిద్ర పోయిన తరువాత వాయించుకుంటాను చెప్పాడు కొడుకు అమాయకంగా.

## పట్టుదల

పట్టుదల ఉంటే మనిషి సాధించలేనిది లేదోయ్ అన్నాడు నరసింహం

అలాగా.... అయితే ఈ గ్లాసులో పాలు కింద పోస్తాను. మీ పట్టుదలతో తిరిగి గ్లాసులో నింపండి చూద్దాం ఎదురన్నాడు కుర్రాడు.

## బాక్సింగ్

ఒక చోట బాక్సింగ్ పోటీలు జోరుగాసాగుతున్నాయి.

కొట్టు... కొట్టు.... దెబ్బకు పళ్ళన్నీ రాలిపోవాలి అని ప్రేక్షకుల్లోంచి అరుస్తున్నాడో వ్యక్తిమీకు బాక్సింగ్ అంటే అంతిష్టమా?

**– ధాతారం పూర్వంశ్**

## ఫన్ చ్










నారు




ఫ్రాన్సిస్ ఫోర్డ్ కొప్పొలా దర్శకత్వంలో 1972లో నిర్మింతమైన హాలీవుడ్ మూవీ ది గాడ్‌ఫాదర్.. ప్రపంచ సినీ చరిత్రలో అత్యుత్తమమయిన సినిమాగా నిలిచింది. ఉత్తమ చిత్రం, ఉత్తమ నటుడు మరియు ఉత్తమ స్క్రీన్‌ప్లే విభాగాలలో ఆస్కార్ అవార్డులు అందుకోవడమే కాక మరెన్నో ప్రశంసలు అందుకొని ఎన్నో జాబితాల్లో అగ్రభాగాన నిలిచింది.




# గుడ్ మూవీ... ది గాడ్‌ఫాదర్

1945లో తన కూతురి వివాహ విందు జరుగుతున్న సమయంలో గాడ్‌ఫాదర్‌గా అందరితో పిలువబడే డాన్ విటో కోర్లియోన్ తన పెంపుడు కొడుకు మరియు సలహాదారు అయిన టాం హేగన్‌తో కలసి తనవద్దకు వచ్చిన వారి అభ్యర్థలను స్వీకరిస్తుంటాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న డాన్ రెండవ కొడుకు మైఖేల్ తన గర్ల్ ఫ్రెండ్ కేతో కలసి విందుకు హాజరయి తన తండ్రి నేర చరిత్ర గురించి చెవుతూ తాను అటువంటి వాడు కాదు అంటాడు. విందుకు అప్పటి ప్రముఖ గాయకుడయిన జానీ ఫోంటాన హాజరయి తాను ఒక సినిమాలో నటించడానికి ఆ స్టూడియో అభిపతి అంగీకరించడంలేదని డాన్ దగ్గర మొరపెట్టుకుంటాడు. అది విన్న డాన్ స్వయానా టాంను కాలిఫోర్నియాకు పంపుతాడు. స్టూడియో యజమాని అయిన వోల్జ్ తాను ఎంతగానో ఇష్టపడే నటీమణిని వలలో వేసుకున్న జానీ ఫాంటానాను సినిమాలో నటుడిగా తీసుకోనని టాంతో చెప్తాడు. మరుసటి రోజు ఉదయం వోల్జ్ నిద్ర లెచినవుడు దుప్పటిలో తనకు ఎంతో ఇష్టమయిన 600,000 విలువగల గుర్రం తల ఉండడం చూసి భయకంపితుడవుతాడు. టాం న్యూయార్క్ తిరిగి వచ్చినప్పుడు శత్రు మాఫియా కుటుంబం అయిన టటాలియా మద్దతు ఉన్న సొలోజ్జో అనే డ్రగ్ డీలర్ డాన్‌తో సమావేశమవుతాడు. సొలోజ్జో తాను చేయబోయే మాదక ద్రవ్యాల వ్యాపారానికి అవసమయిన డబ్బు, రాజకీయ మరియు చట్టపరమయిన సహాయం కావాలని కోరుతాడు. అప్పటికే తన పెద్ద కొడుకు సన్నీ మరియు టాం డ్రగ్స్ వ్యాపారం వల్ల చాలా డబ్బు సంపాదించవచ్చు అని చెప్పినప్పటికీ, డ్రగ్స్ వ్యాపారం వల్ల తనకున్న విలువపోతుందని తాను సహాయం చేయనని సొలోజ్జోకు చెప్తాడు డాన్. తర్వాత సొలోజ్జో గురించి మరిన్ని వివరాలు తెలుకొనడానికి తన ముఖ్య అనుచరుడయిన లూకా బ్రాజిని పంపుతాడు. ఇది జరిగిన తరువాత డాన్ పైన హత్యాప్రయత్నం జరుగుతుంది. పలుమార్లు కాల్చబడినా డాన్ బ్రతుకుతాడు. అదే సమయంలో లూకా బ్రాజిని సొలోజ్జో హతమారుస్తాడు. సొలోజ్జో ఆ తరువాత టాంని బంధించి తన వ్యాపారానికి సహాయం చెయ్యవలసిందిగా సన్నీని ఒప్పించమని ఆదేశిస్తాడు. సన్నీ అందుకు ఒప్పుకొనక తన అనుచరులతో కలసి టటాలియా కొడుకును హత్య చేయిస్తాడు. తన తండ్రి పైన జరిగిన హత్యాయత్నాన్ని తెలుసుకొని మైఖేల్ తన తండ్రి ఉన్న హాస్పిటల్‌కు వచ్చి అక్కడ అవినీతిపరుడయిన పోలీస్ అధికారి కాప్టెన్ మెక్ళుస్కి చేతిలో దెబ్బలు తింటాడు. డాన్ కుటుంబ సభ్యులతో సమావేశానికి ఆహ్వానం పంపుతాడు సొలోజ్జో. కేవలం మైఖేల్ ఒక్కడే ఆ సమావేశానికి హాజరయి సొలోజ్జోను, కాప్టెన్ మెక్ళుస్కీని కాల్చి చంపుతాడు. ఇది తెలుసుకొన్న సన్నీ వెంటనే తన తమ్ముడిని సిసిలీకి పంపించి మిగిలిన ఐదు కుటుంబాల పైన యుద్ధం ప్రకటించి పోలీసుల సహకారంతో వారి కార్యకలాపాలకు అవరోధం కలిగిస్తాడు. కొద్ది కాలానికి ఒక రోజు సన్నీ తన చెల్లెలయిన కాన్నీని ఆమె భర్త కార్లో కొట్టాడని తెలుసుకొని కార్లోని తీవ్రంగా కొట్టి మరొక్కసారి తన చెల్లెలిని కొడితే ప్రాణాలు తీస్తాను అంటాడు. పగతో కార్లో శత్రువులయిన టటాలియా, బార్జినిలతో చేతులు కలువుతాడు. కట్టుదిట్టమయిన భద్రతలో ఉన్న సన్నీని బయట రప్పించడానికి కార్లో మరొక్కసారి తన భార్యను కొడతాడు. ఇది తెలుసుకొని సన్నీ ఒంటరిగా బయలుదేరి దారి మధ్యలో హతమవుతాడు. పెద్దకొడుకు మరణవార్త విన్న డాన్ మిగితా మాఫియా నాయకులను సమావేశపరచి తన మూడవ కొడుకయిన మైఖేల్‌కు ఎటువంటి హానీ తలపెట్టకపోతే వారి వ్యాపారాలకు పూర్తి సహకారం అందించడానికి ఒప్పుకుంటాడు. ప్రాణహాని లేదన్ని సంగతి తెలిసిన మైఖేల్ అమెరికాకు తిరిగి వస్తాడు. ఏడాది తర్వాత తన గర్ల్ ఫ్రెండ్ అయిన కేని కలుసుకొని ఆమెను పెళ్ళి చేసు కుంటానని చెప్తాడు. డాన్ ఆరోగ్యం సరిగా లేకపోవడం, తన రెండవ అన్నయ్య ఫ్రేడో సమర్థుడు కాకపోవడంతో మైఖేల్ మొత్తం కుటుంబ వ్యాపారాలు చూసుకోవడం మొదలు పెడతాడు. ఐదేళ్ళలో అన్ని వ్యాపారాలు చట్టబద్దం చేస్తానని తన భార్యకు మాట ఇస్తాడు మైఖేల్. మైఖేల్ కుటుంబం మొత్తం న్యూయార్క్ నుండి నెవాడాకు తరలించడానికి ఏర్పాట్లు చేస్తాడు. తన చెల్లెలి భర్త అయిన కార్లో నెవాడాలో తన ముఖ్య అనుచరుడిగా పని చేస్తాడని టాం కేవలం ఒక లాయర్‌గా మాత్రమే ఉంటాడని ప్రకటి స్తాడు. కొద్ది రోజులకు డాన్ గుండిపోటుతో మరణిస్తాడు. తన చెల్లిలి కొడుకు బాప్టిజం జరుగు తున్న సమయంలో మిగిలిన ఐదు కుటుంబాల బాస్‌లను తన అనుచ రులతో హత్య చేయిస్తాడు. తన అన్నను హత్య చేయిం చడంలో కార్లో పాత్ర ఉందని కార్లోతో నిజం చెప్పిస్తాడు. కొద్ది క్షణాలకే కార్లో హతమవుతాడు. చివరగా, కాన్నీ తన భర్తను చంపించినది నువ్వే అంటూ మైఖేల్‌ను నిలదీస్తుంది. అది చూసి మైఖేల్ భార్య అయిన కే కూడా నిలదీసినవుడు కార్లోని తాను హత్య చేయించలేదని అబద్ధం చెప్తాడు మైఖేల్. అనుచరులు ఒక్కొక్కరు వచ్చి మైఖేల్‌ను డాన్‌గా గౌరవిస్తారు.

## ది గాడ్ ఫాదర్ నిర్మాణం వెనుక

డాన్ విటో కోర్లియోన్ పాత్ర పోషించడానికి మార్లాన్ బ్రాండోను ఎన్నుకున్నాడు దర్శకుడయిన కొప్పొలా. కానీ అప్పటికే ఇతర చిత్రాలలో బ్రాండోతో ఎదుర్కొన్న సమస్యలవల్ల చిత్ర నిర్మాత అయిన పారామవుంట్ పిక్చర్స్ ఒప్పుకోలేదు. పారామవుంట్ పిక్చర్స్ అధినేతలను కొప్పొలా ఎంతో బ్రతిమాలుకున్న తర్వాత బ్రాండో అప్పటి తన పారితోషికం కంటే తక్కువ పారితోషికానికి నటించాలి, స్క్రీన్ టెస్ట్ తీసుకోవాలి, చిత్ర నిర్మాణానికి ఎటువంటి ఆటంకాలు కలిగించకూడదు అన్న షరతులతో ఒప్పుకున్నారు.

మైఖేల్ పాత్రకు పెద్దగా పేరు ప్రఖ్యాతులు లేని ఇటాలియన్–అమెరికన్ లా కనిపించే అల్ పచినోను ఎన్నుకోవడం కూడా నిర్మాతలకు రుచించలేదు. అల్ పచినో పొడవు తక్కువ ఉండడం, కేవలం రెండు చిత్రాల అనుభవం మాత్రమే ఉన్నందువల్ల అతనిని నటుడుగా తీసుకోవడానికి నిర్మాతలు ఒప్పుకోక ఇతర నటులను తీసుకోవలసిందిగా కొప్పొలాకు సూచించారు. అల్ పచినోను మైఖేల్ పాత్రకు ఎంపిక చేయకుంటే తాను దర్శకత్వం చేయనని కొప్పొలా చెప్పడంతో నిర్మాతలు ఒప్పుకున్నారు.

చిత్ర నిర్మాణం 1971 మార్చి 29 న మొదలయి 1971 ఆగష్టు 6 న అనుకున్న ప్రణాళికకంటే ఆరు రోజులు ముందుగా 77 రోజుల్లో పూర్తి అయినది. ఈ చిత్రంలో గుర్రం తలను చూపించడాన్ని జంతు హక్కుల సంఘం తీవ్రంగా ఆక్షేపించింది. ఈ చిత్రం కోసం తాము గుర్రం తల ఖండిచలేదని, అది ఒక ఆహారపదార్థాల కంపెనీ పంపిందని కొప్పొలా వివరణ ఇవ్వడంతో వివాదం సద్దుమణిగింది.

చిత్ర నిర్మాణం న్యూయార్క్, కాలిఫోర్నియా మరియు సిసిలీలలో జరిగింది. విడుదల తర్వాత ఈ చిత్రం ప్రపంచ వ్యాప్తంగా గొప్ప పేరు తెచ్చుకున్నది. దాదావు అన్నిచోట్ల ప్రపంచ సినీ చరిత్రలో అత్యుత్తమమయిన చిత్రంగా ప్రశంసలు అందుకున్నది. అప్పటివరకు ఉన్న బాక్సాఫీసు కలెక్షన్లను ఈ చిత్రం తిరగరాసింది. 6,000,000 తో నిర్మించబడి 81,500,000 కలెక్షన్లు సాధించి నిర్మాతలకు అమిత లాభాలను ఆర్జించింది. 11 విభాగాల్లో ఆస్కార్ అవార్డులకు ఎన్నికయి మూడు విభాగాల్లో ఆస్కార్ గెలుచుకుంది.





అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టన్



మాయాబజార్ తెలుగు చలనచిత్ర సీమలో అత్యంత ప్రజాదరణ పొందిన సినిమా. ఈ చిత్రం 1957, మార్చి 27 వ తేదీన విడుదలై అద్భుత విజయం సాధించింది. షావుకారు, పాతాళభైరవి, మిస్సమ్మ, జగదేకవీరుని కథ, గుండమ్మ కథ లాంటి జనరంజక చిత్రాలను నిర్మించిన విజయా సంస్థ తెలుగు సినీ అభిమానులకందించిన మరొక అపురూప కళాఖండం ఇది.




# న భూతో న భవిష్యతి! మాయా బజార్

భక్త పోతన, యోగి వేమన, గుణసుందరి కథ, పాతాళ భైరవి, దొంగరాముడు చిత్రాలను రూపొందించిన కె వి రెడ్డి ఈ చిత్రానికి కూడా దర్శకుడు. ఇక కథ విషయానికి వస్తే, మహాభారతంలో జరగని ఒక కల్పిత గాథ, ఈ చిత్ర కథావస్తువు. దుర్యోధనుని కుమారుడైన లక్ష్మణ కుమారునితో వివాహం నిశ్చయమైన శశిరేఖను, ఘటోత్కచుడు తన మాయజాలంతో అపహరించి, తన ఆశ్రమంలో అభిమన్యునితో వివాహం జరిపించడం, తాను మాయా శశిరేఖ అవతారం దాల్చడం, కౌరవులను ముప్పుతిప్పలు పెట్టడం, కృష్ణుడు వీటన్నిటికి పరోక్షంగా సహకరించడం, ఇవి ఈ చిత్రంలోని ముఖ్య ఘట్టాలు. సంగీత, సాహిత్యాల విషయానికి వస్తే, ఈ చిత్రము ఒక మహాద్భుతమని చెప్పవచ్చు. మాయాబ జార్ సినిమా కోసం పింగళి నాగేంద్రరావు రచించిన మాటలు, పాటలు అజరామరంగా నిలుస్తాయి. ఈ చిత్రంలో రచయిత పింగళి నాగేంద్రరావు తస్మదీయులు, దుష్టచతుష్టయం, జియ్యా, రత్నగింబళీ, గిల్పం, శాఖంబరి దేవి ప్రసాదం, వంటి కొత్త పదాలను మనకు రుచి చూపిస్తాడు. రసపట్టులో తర్కం కూడదు, భలే మామా భలే, ఇదే మన తక్షణ కర్తవ్యం, ఎవరూ కనిపెట్టకుండా మాటలు ఎలా వుడతాయి, వేసుకో వీరతాడు వంటి సంభాషణలు మనల్ని గిలిగింతలు పెట్టిస్తాయి. మాటలు లేని చోటుల్లో కెమెరా మరింత అద్భుతంగా పనిచేస్తుంది. ఉదాహరణకు చిన్న పిల్లగా ఆడుకుంటున్న శశిరేఖ ఉద్యానవనంలో ఒక కొలని గట్టున అలవోకగా కూర్చుంటుంది. కెమెరా ఆమె మోహమ్మీదనుంచి మెల్లగా పాన్ అయి కొలనులోని తామరమొగ్గను చూపిస్తుంది. గడచి పోతున్న కాలానికి గుర్తుగా కొలనులో అలలు రేగడమూ, ఆ మొగ్గ మెల్లగా విచ్చుకోవడమూ, ఆ తర్వాత కెమెరా మెల్లగా వెనక్కి తిరిగి శశిరేఖ మోహాన్ని చూపడమూ జరుగు తాయి. ఇప్పుడక్కడ నవయవ్వనవతియైన శశిరేఖ అంటే సావిత్రి ఉంటుంది! ఈ చిత్రానికి మొదటగా సాలూరు రాజేశ్వరరావు సంగీత దర్శకులుగా నియమితులయ్యారు. 4 యుగళగీతాలకు స్వర కల్పన



చేసాక, కారణాంతరాల వలన ఆయన తప్పు కోగా సంగీత దర్శకుడిగా ఘంటసాల నియమితు లయ్యారు. రాజేశ్వర రావు కట్టిన బాణీలకు వాయిద్య సంగీతాన్ని సమకూర్చి రికార్డు చేసారు ఘంటసాల. ఘంటసాల, పి.లీల, పి.సుశీల, మాధవపెద్ది సత్యం మొదలగు వారి నేపథ్య గానంలో వచ్చిన, నీవేనా నను తలచినది, చూపులు కలసిన శుభవేళా, లాహిరి లాహిరి లాహిరిలో, నీ కోసమె నే జీవించు నదీ, సుందరి నీవంటి, ఆహ నా పెళ్ళి అంటా, వివాహభోజనంబు వంటి గీతాలు చరిత్రలో చిరస్థాయిగా నిలిచాయి.

చమత్కారమేమిటంటే ఈ పాటల పల్లవులు తర్వాతి కాలంలో సినిమా పేర్లుగా వాడుకోబడ్డాయి. ఆలాగే లాహిరి లాహిరి లాహిరిలో అన్న ఒకే పాటకు ముగ్గురు నటులకు (ఎన్.టి.ఆర్, ఎ.ఎన్.ఆర్, గుమ్మడి) ఘంటసాల పాడటం ఒక ప్రత్యేక విశేషం. ఇక స్క్రిప్టు మనల్ని తల తిప్పుకోనీ యకుండా చేస్తే మార్కస్ బార్ట్లే ఛాయాగ్రహణం, హర్బన్స్ సింగ్ స్పెషల్ ఎఫెక్ట్లు మనల్ని రెప్ప వాల్చనీయకుండా చేస్తాయి. ఈ చిత్రానిది ప్రపంచ సినిమా చరిత్రలోనే అత్యుత్తమమైన స్క్రీన్ ప్లే అని గుమ్మడి వెంకటేశ్వరరావు అభిప్రాయపడ్డారు. లాహిరి లాహిరి లాహిరిలో పాటను చూసి తెలుగు సినిమా చరిత్ర లోనే వెన్నెలనింత అందంగా ఇంకెక్కడా చూడలేదు' అనుకున్న వారు ఆ పాటను మండుటెండలో తీశారని తెలుసుకుని తెల్లబోయారు.

స్పెషల్ ఎఫెక్టులలో మచ్చుకు కొన్ని

*అభిమన్యుడి దగ్గరకు తొలిసారి వచ్చినప్పుడు ఘటోత్కచుడు కొండ మీద దూకగానే ఆ అదటుకు కొండకొమ్ము విరిగి పడడం,*

*ఘటోత్కచుడి వివాహభోజనంబు షాట్లు*

*కంప్యూటర్ (గ్రాఫిక్స్) లేని రోజుల్లో ఈ షాట్లు ఎలా తీయగలిగారనేది తలచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది.*

*పాత్రలు వాటి స్వభావాలు, పాత్రధారులు*

*మాయామహల్లో కంబళి లా కనిపించే గింబళి తనంతట తనే లోపలికి చుట్టుకోవడం,*

*తల్పం లాంటి గిల్పం గిరగిరా తిరిగి క్రిందపడ దోయడం లాంటి విడ్డూరాలు,*

## *26 లక్షలు రూపాయలు ఖర్చు*

అప్పట్లో ఈ సినిమాకు 26 లక్షలు రూపాయలు ఖర్చు అయ్యింది. అంత ఖర్చు పెట్టి తీయడం విజయా వారికే సాధ్యమయ్యింది. విజయావారి సినిమాలో నటించ డం నటీనటులకొక ప్రతిష్ఠాత్మక విషయంగా భావించే వారు. చాలా మంది కోరిక ఈ మాయాబజార్ సిని మాతో సఫలమయ్యింది. మాయా బజార్ తెలుగులోనే కాదు. యావత్ భారత చిత్ర సీమలో ఎవర్‌గ్రీన్ హిస్టారిక్ చిత్రం. ఈ చిత్రం ఆంధ్ర దేశమం తటా 1957, మార్చి 27 వ తేదీన విడుదలై అద్భుత విజయం సాధించింది. 2007 మార్చినాటికి 50 ఏండ్లు పూర్తిచేసుకొన్న ఈ సినిమాపై వివిధ టెలివిజన్ ప్రసార వాహినులు (ఛానళ్ళు), వార్తా పత్రికలు ప్రముఖంగా ప్రత్యేక వ్యాసాలు అందించాయి. షావుకారు, పాతాళభైరవి, మిస్సమ్మ, జగదేకవీరుని కథ, గుండమ్మ కథ లాంటి జనరంజక చిత్రాలను నిర్మించిన విజయా సంస్థ తెలుగు సినీ అభిమానులకందించిన మరొక అపురూప కళాఖండం ఇది. భక్త పోతన, యోగి వేమన, గుణసుందరి కథ, పాతాళ భైరవి, దొంగరాముడు మొదలగు చిత్రములను రూపొందించిన కె వి రెడ్డి ఈ చిత్రానికి కూడా దర్శకుడు. నందమూరి తారక రామా రావు, అక్కినేని నాగేశ్వరరావు, ఎస్.వి.రంగారావు, సావిత్రి, గుమ్మడి వెంకటేశ్వరరావు, ఋష్యేంద్రమణి, ఛాయాదేవి, సూర్య కాంతం, సంధ్య (దివంగత ముఖ్య మంత్రి జయలలిత తల్లి), సి.ఎస్.ఆర్ వంటి ఎందరో గొప్ప నటులు ఈ చిత్రంలో నటించారు. ఈ చిత్రానికి మొదటగా సాలూరు రాజేశ్వరరావు సంగీత దర్శకులుగా నియమితులయ్యారు. 4 యుగళగీతాలకు స్వర కల్పన చేసాక, కారణాంతరాల వలన ఆయన తప్పుకోగా సంగీత దర్శకుడిగా ఘంటసాల నియమితుల య్యారు. రాజేశ్వర రావు కట్టిన బాణీలకు వాయిద్య సంగీతాన్ని సమకూర్చి రికార్డు చేసారు ఘంటసాల. కాగా మరికొన్ని విశేషాలు ఈ చిత్రంలో చోటు చేసుకున్నాయి. కంప్యూటర్ రంగంలో వినియోగానికి వచ్చిన లాప్ టాప్ అనే పరికరాన్ని, వీడియో కాలింగ్ అనే సౌకర్యాన్ని పోలివున్న ప్రియదర్శిని అనే పరిక రాన్ని 1957లోనే మాయాబజార్ సినిమా ఊహించ గలిగింది. మార్చి 2007లో ఈ సినిమాకు 50 సంవత్స రాలు నిండిన సందర్భంగా ప్రముఖ టెలివిజన్ ఛానళ్ళు ప్రత్యేక కార్యక్రమాలను సమర్పించాయి.

– గోటేటి జానకి





# వీధి పోట్లు కూడా శుభ ఫలితాలను ఇస్తాయి... తెలుసా..?

వాస్తుశాస్త్రం ప్రకారం ఇంటికి ఎదురుగా నిలువుగా ఉన్నవీధి ఇంటివరకూ వచ్చి ఆగిపోయినా, లేదా ఏదోవైపుకు తిరిగినా దానిని వీధిపోటు ఉన్న ఇల్లు అంటారు. వీధిపోటు ఉన్న ఇల్లు బొత్తిగా నివాసయోగ్యం కాదనీ, ఆ ఇంట కాపురముండే వారు అష్టకష్టాలు పడతారని చాలామంది అపోహపడుతుంటారు. ఈ అపోహల మూలంగా నిరంతరం మానసిక అశాంతికి గురై తక్కువ ధరకే ఇల్లు అమ్ముకుపోయేవారు కొందరైతే , రిపేర్ల పేరిట బోలెడంత డబ్బు ఖర్చు చేసి ఆర్థికంగా నష్టపోతుంటారు. అయితే నిజానికి ఏ దిశలో వీధిపోటు ఉన్నాదనే అంశం మీదే ఆయా ఫలితాలు ఆధారపడి ఉంటాయి.




ఇంటికి తూర్పు మొగ్గున్న ఈశాన్య వీధిపోటు సానుకూల ఫలితానిస్తుంది. ఈ ఇంటిలోని పురుషులు ఇంటా బయటా చక్కని గౌరవం, అధికారాన్ని పొందుతారు. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగి తమతమ రంగాల్లో అత్యున్నత విజయాలను సాధిస్తారు. ఇంటికి ఉత్తరం మొగ్గున్న ఈశాన్య వీధి పోటు కూడా మంచిదే. ఈ ఇంటి లోని స్త్రీలు అన్ని విధాలా ఉత్తమ ఫలితాలు పొందుతారు.




ఇంటి యజ మాని చీకూ చింతా లేకుండా జీవి తాన్ని గడపటమే గాక కుబేర అనుగ్ర హాన్ని పొందుతారు.

ఇంటికి ఉత్తరం మొగ్గున్న వాయువ్య వీధి పోటు ఉంటే ఆ కుటుం బంలో ఉన్న యుక్తవయ స్కులకు పెళ్లి కుదరకపోవ టం, కుదిరినా ఆగిపోవటం వంటి సమస్యలు ఎదురవుతాయి. ఈ ఇంటి మహిళలు అనైతిక విషయాల పట్ల ఆకర్షితులు కావటంతో బాటు ఎప్పుడూ ఏవో తెలియని సమస్యలతో జీవితాన్ని గడపాల్సివస్తుంది.

ఇంటికి పడమర వైపు మొగ్గున్న వాయువ్య మూలన వీధిపోటు ఉంటే ఆ ఇంట అన్నీ సానుకూల ఫలితాలే. ఆ యజమాని కీర్తిని, ధనాన్ని ఆర్జిస్తాడు. అందరి ఆమోదాన్ని పొందిన వ్యక్తులుగా వీరు రాజకీయాల్లో చక్కని రాణింపును పొందుతారు. ఇంటికి పడమర మొగ్గున్ననైరుతి వీధిపోటు ఉన్న ఇంట ఆర్థిక పరిస్థితి ఎప్పుడూ గందరగోళంగా ఉంటుంది. ఎంత కష్టపడినా ఆశించిన ప్రయోజనం మాత్రం ఉండదు. ఇంటికి దక్షిణం మొగ్గున్ననైరుతి వీధిపోటు కూడా అశుభాలకే దారి తీస్తుంది. దంపతుల మధ్య కలహాలు, ఆ ఇంట ఉండే స్త్రీలకు ఎప్పుడూ ఏదో ఒకరకమైన అనారోగ్యం ఉంటాయి. తలపెట్టిన ప్రతిపని లోనూ అవాంతరాలను ఎదుర్కొంటారు.

ఇంటికి దక్షిణం మొగ్గున్న ఆగ్నేయ వీధిపోటు శుభ ఫలితాన్నిస్తుంది. ఈ ఇంట కాపురముండే కుటుంబం తృాఎప్తికరంగా, సుఖంగా జీవితాన్ని కొనసాగిస్తారు. ఈ ఇంటివారు బంధువులను చక్కగా ఆదరిస్తారు. ఈ ఇంట తలపెట్టిన ఏ శుభకార్యమైనా నిర్విఘ్నంగా జరుగుతుంది. ఇంటికి తూర్పు మొగ్గున్నఆగ్నేయ వీధి పోటు అనేక సమస్యల్ని సృాఎష్టిస్తుంది. మానసిక అశాంతి, ఆదాయానికి మించిన ఖర్చులు, కుటుంబ సభ్యుల మధ్య తగాదాలు వంటి సమస్యలకు కారణమవుతుంది.

వాత్సాయన

# మగవాళ్లను జీవితాంతం ప్రేమించాలి అనిపించే ఆడవాళ్ల అలవాట్లు



మగవాళ్లకు జీవితాంతం ప్రేమించాలి అనిపించే ఆడవాళ్ల అలవాట్లు..! ఆడవాళ్లు కొన్ని రకాలుగా ప్రవర్తిస్తే.. మగవాళ్లకు జీవితాంతం తన భార్యను ప్రేమగా చూసుకోవాలి అన్న ఫీలింగ్ కలుగుతుందట. మరి ఆడవాళ్ల ఎలాంటి ప్రవర్తన వల్ల మగవాళ్లకు ఈ ఫీలింగ్ కలుగుతుంది ? మగవాళ్లకు.. మహిళలు దేవుడిచ్చిన బహుమతులుగా చెప్పవచ్చు. ఎందుకంటే.. మిమ్మల్ని అంత జాగ్రత్తగా చూసుకుంటుంది. అందరికంటే ఎక్కువగా ప్రేమిస్తుంది. కానీ.. అందరికంటే ఎక్కువ వేధిస్తుంది కూడా. అయితే మీపై ఎంతో కేర్ తీసుకునే, ప్రేమ చూపించే భార్య కోసం మగవాళ్లు కొంత సమయాన్ని కూడా కేటాయించలేరు. చిన్నపిల్లలా ప్రవర్తిస్తున్నావు అని, ఎక్కువ ఫోటోలు తీసుకుంటున్నావు అని, ఎక్కువ సమయం షాపింగ్ చేసేటప్పుడు కూడా సహకరించరు. అయితే కొన్ని సందర్భాల్లో ఆడవాళ్ల నడవడిక, ప్రవర్తన మగవాళ్లలో చాలా ప్రేమ పుట్టేలా చేస్తుంది. ఆడవాళ్లు కొన్ని రకాలుగా ప్రవర్తిస్తే.. మగవాళ్లకు జీవితాంతం తన భార్యను ప్రేమగా చూసుకోవాలి అన్న ఫీలింగ్ కలుగుతుందట. మరి ఆడవాళ్ల ఎలాంటి ప్రవర్తన వల్ల మగవాళ్లకు ఈ ఫీలింగ్ కలుగుతుంది, ఎలాంటి పద్ధతుల్లో మహిళలు ప్రవర్తిస్తే.. మగవాళ్లు కొండంత ప్రేమ చూపిస్తారు.. చెస్ట్ పై తల చెస్ట్ పై తల మగవాళ్ల చెస్ట్ పై మహిళలు తల పెట్టుకుంటే.. వాళ్లు చాలా హ్యాపీగా ఫీలవుతారు. అంతే.. వాళ్లకు మీపై ప్రేమ రెట్టింపు కాదు.. అంతకంటే ఎక్కువే అవుతుంది. జుట్టుతో ఆడుకుంటే జుట్టుతో ఆడుకుంటే రొమాన్స్ చేసేటప్పుడు ఆడవాళ్లు.. తమ భాగస్వామి తలలో చేయి పెట్టి.. జుట్టుతో ఆడుకుంటే.. చాలా హ్యాపీగా ఫీలవుతారట. శారీరక ఒత్తిడి ఉన్నప్పుడు.. మీరు వ్యక్తపరిచే ప్రేమ, ఆప్యాయతను వాళ్లు బాగా గుర్తించగలుగుతారు. సోషల్ మీడియా సోషల్ మీడియా నమ్మినా నమ్మకపోయినా.. తన భర్త గురించి, తన భర్త కురిపించే ప్రేమ గురించి సోషల్ మీడియా వేదికగా ప్రసంశలు కురిపిస్తే.. భర్త చాలా హ్యాపీగా ఫీలవుతాడట. వినడం వినడం భర్త చెప్పే విషయాన్ని చాలా జాగ్రత్తగా, కేర్ ఫుల్ గా వింటే.. వాళ్ల మనసులో బలమైన స్థానాన్ని సంపాదించుకున్నట్టే. మీరు వాళ్లు మాట్లాడేది బాగా కేర్ ఫుల్ గా వింటూ ఉంటే.. మీపై ప్రేమను కురిపిస్తారట. ఫ్రెండ్స్ తో ఉన్నప్పుడు పీరియడ్స్ సమయంలో మహిళలు ఎదుర్కొనే భయంకరమైన విషయాలు పీరియడ్స్ సమయంలో మహిళలు ఎదుర్కొనే భయంకరమైన విషయాలు అలర్ట్ : వన్ సైడ్ చెస్ట్ పెయిన్ కు కొన్ని ఫర్ఫెక్ట్ రీజన్స్ ..!! అలర్ట్ : వన్ సైడ్ చెస్ట్ పెయిన్ కు కొన్ని ఫర్ఫెక్ట్ రీజన్స్ ..!! మీ వయస్సుని 10ఏళ్లు వెనెక్కి తీసుకెళ్లి..యంగ్ గా మార్చే అద్భుతమైన ఫేస్ మాస్క్ లు..!! మీ వయస్సుని 10ఏళ్లు వెనెక్కి తీసుకెళ్లి..యంగ్ గా మార్చే అద్భుతమైన ఫేస్ మాస్క్ లు..!! ఫ్రెండ్స్ తో ఉన్నప్పుడు మీరు మీ ఫ్రెండ్స్ తో లేదా మీ రిలేటివ్స్ గడుపుతూ ఉన్నప్పుడు మీ భర్తకు మెసేజ్ లేదా కాల్స్ చేస్తూ ఉండటం వల్ల.. మీరు మీ ఫ్రెండ్స్ తో పనిలో ఉన్నాకూడా తన గురించి ఆలోచిస్తున్నారని గర్వంగా ఫీలవుతారట. పబ్లిక్ లో పబ్లిక్ లో పబ్లిక్ లో మహిళలు చాలా అఫెక్షనేట్ గా ఉంటే.. మగవాళ్ల హార్ట్ బీట్ చాలా ఫాస్ట్ గా మారుతుంది. ఉదాహరణకు మహిళలు పబ్లిక్ లో ఉన్నప్పుడు తన భర్త జుట్టుని సరిచేయడం లేదా ముందుగా చేతిని పట్టుకోవడం వల్ల చాలా ప్రేమగా ఫీలవుతారు.



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్







# పదేళ్ల తరువాత ఆనంద నందులు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 2012, 2013 సంవత్సరాలకు సంబంధించిన నంది అవార్డులను ఎట్టకేలకు ప్రకటించింది. దీంతో ఈ నంది అవార్డులను తెలుగు రాష్ట్రాల్లో ఏ ప్రభుత్వం ఇస్తుందన్న అనుమానాలకు తెర పడినట్లయ్యింది. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం నంది అవార్డుల స్థానంలో కొత్త అవార్డులను ఇస్తామంటూ ప్రకటించిన నేపథ్యంలో, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 2012, 2013 సంవత్సరాలకు సంబంధించిన నంది అవార్డులను ప్రకటించింది. 2012 సంవత్సరానికి ప్రకటించిన అవార్డుల్లో ఈగ, ఎటోవెళ్లిపోయింది మనసు, మిథునం సినిమాలు పోటీ పడగా ఈగ సినిమా ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకుడు అవార్డులతో కలిపి తొమ్మిది అవార్డులను సొంతం చేసుకుంది. ఎటో వెళ్లిపోయింది మనసు సినిమాకు నాలుగు అవార్డులు దక్కాయి. మిథునం చిత్రానికి రెండు, మిణుగురులుకు ఐదు అవార్డులు దక్కాయి. ఎస్వీ రంగారావు పురస్కారానికి గాను ఆశిష్ విద్యార్థిని ఎంపిక చేశారు. సీనియర్ నటి జయసుధ అధ్యక్షతన ఏర్పాటైన కమిటీ ఎంట్రీ లను పరిశీలించి విజేతలను నిర్ణయించింది.

*2012 నంది అవార్డులు*

ఉత్తమ చిత్రం : ఈగ

ద్వితీయ ఉత్తమ చిత్రం : మిణుగురులు

తృతీయ ఉత్తమ చిత్రం : మిథునం

ఉత్తమ దర్శకుడు : రాజమౌళి ( ఈగ )

ఉత్తమ నటుడు : నాని (ఎటో వెళ్లిపోయింది మనసు)

ఉత్తమ నటి : సమంత (ఎటో వెళ్లిపోయింది మనసు)

ఉత్తమ విలన్ : సుదీప్ (ఈగ)

*2013 నంది అవార్డులు*

ఉత్తమ చిత్రం : మిర్చి

రెండో ఉత్తమ చిత్రం : నా బంగారు తల్లి

మూడో ఉత్తమ చిత్రం : ఉయ్యాల జంపాల

ఉత్తమ కుటుంబ కథా చిత్రం : సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు

అత్యంత ప్రజాదరణ పొందిన చిత్రం : అత్తారింటికి దారేది

ఉత్తమ హీరో : ప్రభాస్ (మిర్చి)

ఉత్తమ హీరోయిన్ : అంజలి పాటిల్ (నా బంగారు తల్లి)

ఉత్తమ దర్శకుడు : దయా కొడవగంటి (అలియాస్ జానకి)

ఉత్తమ సంగీత దర్శకుడు : దేవీ శ్రీ ప్రసాద్ (అత్తారింటికి దారేది)

ఉత్తమ విలన్ : సంపత్ రాజ్ (మిర్చి)

ఉత్తమ దర్శకుడు, ఉత్తమ చిత్రం విభాగాల్లో అవార్డులు గెలుచుకొన్న ఈగ చిత్రం 2012 సంవత్సరానికి మేటిగా నిలిచింది. ఒక ఈగను హీరోగా చేసి సినిమాను రక్తి కట్టించడం సామాన్యమైన విషయం కాదు. అందువల్ల కూడా కమిటీకి ఈగ నచ్చి ఉండవచ్చు.

**ఆనందంగా ఉంది!**

ఈగ సినిమాకు నంది అవార్డులు రావడం ఆనందంగా ఉందని దర్శకుడు రాజమౌళి పేర్కొన్నారు. ఈ చిత్రం యూనిట్‌కు మంచి మైలేజ్ ఇస్తుందని నిర్మాత సాయి కొర్రపాటి అప్పుడే చెప్పారు. అది నిజమైంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మా చిత్రాన్ని గుర్తించి అవార్డులు ఇచ్చినందుకు ధన్యవాదాలు. కమిటీకి రుణపడి ఉంటాం. నాతో పాటు ఈ చిత్రానికి నంది అవార్డులు గెలుచుకున్న సుదీప్, సెంథిల్‌కుమార్, కడియాల దేవికృష్ణ, కోటగిరి వెంకటేశ్వరరావు, కీరవాణి, ఎటో వెళ్లిపోయింది మనసుకి గానూ నంది అవార్డులు గెలుచుకున్న సమంత, నాని తదితరులకు శుభాకాంక్షలు.

**వెరీ..వెరీ..వెరీ స్పెషల్**

ఏ వెరీ స్పెషల్ అవార్డు, ఏ వెరీ స్పెషల్ ఫీల్మ్, ఏ వెరీ స్పెషల్ టీమ్. నంది అవార్డు గెలుచుకున్నందుకు చాలా ఆనందంగా ఉందని నటుడు నాని పేర్కొన్నారు. ఉత్తమ నటి విభాగంలో నంది సొంతం చేసుకున్న సజమంతకు శుభాకాంక్షలు. ఎటో వెళ్లిపోయింది మనసు చిత్రానికి అత్యద్భుతంగా దర్శకత్వం వహించిన గౌతమ్ మీనన్‌గారికి ధన్యవాదాలు. అవార్డు ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి రుణపడి ఉంటానన్నారు.

**చాలా హ్యాపీగా ఉంది**

ఎటో వెళ్లిపోయింది మనసు చిత్రానికి ఉత్తమ నటి కేటగిరీలో నాకు నంది అవార్డు రావడం చాలా సంతోషంగా ఉందిని కథానాయిక సమంత పేర్కొంది. అవార్డు ఇచ్చినందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ధన్యవాదాలు. ఉత్తమ నటునిగా నంది అవార్డు గెలుచుకున్న నానికి శుభాకాంక్షలు తెలియజేసింది.

**కొత్త థ్రిల్‌కు లోనయ్యా!**

ఉత్తమ మాటల రచయితగా నంది అందుకోవడం ఇదే మొదటిసారని దర్శకుడు, రచయిత, నటుడు తనికెళ్ల భరణి పేర్కొన్నారు. నేను రచన మానేసి, దర్శకత్వం వహించిన మిథునంకి మాటలు రాసుకున్నప్పుడు అవార్డు రావడం ఈ సుదీర్ఘ ప్రయాణంలో కొత్త థ్రిల్. తృతీయ ఉత్తమ చిత్రం అవార్డుతో పాటు ఎస్పీ బాలుగారు, లక్ష్మీగారికి కూడా స్పెషల్ జ్యూరీ అవార్డులు వచ్చాయి. మా చిత్రం విడుదలైనప్పుడు ప్రపంచవ్యాప్తంగా ఆదరించారు. ఇప్పుడు ప్రభుత్వం గుర్తించడం సంతోషంగా ఉంది.

# ఆకాశంలో సగం అధికారంలో...?





అనాదిగా పురుషాధిక్య సమాజంలో గృహాలకే పరిమితమైన మహిళలు గత రెండు దశాబ్దాలుగా విద్య, వైద్య, న్యాయ, సాంకేతిక రంగాల్లో అత్యుత్తమ ప్రతిభను ప్రదర్శిస్తూ పురుషులకు తామేమీ తీసిపోమని నిరూపించుకుంటున్నారు. కానీ రాజకీయ రంగంలో మాత్రం మహిళలు ఇంకా వెనుకబడే ఉన్నారు. శాసనసభల్లో వారి ప్రాతినిధ్యం 10 శాతం లోపే ఉంటోంది. అందువల్ల వారికి 33 శాతం రిజర్వేషన్లను చట్టబద్ధంగా కల్పించాలని మహిళా రిజర్వేషన్ బిల్లు ప్రతిపాదించారు. సమాజంలో ఏ సమస్యనైనా నిర్మూలించాలంటే రాజకీయాధికారం అవసరం. మహిళలకు రాజకీయ అధికారం ఉన్నప్పుడే సాధికారత సాధ్యమై మహిళా సమస్యలు పరిష్కారమవుతాయి.

### సాధికారత అంటే...

తనపై తాను అధికారం సంపాదించడాన్ని, భౌతిక వనరులపైన, విజ్ఞానం పైన నియంత్రణ సాధించడాన్ని సాధికారత అంటారు. అంటే స్త్రీ తన వ్యక్తిగత విషయాలైన విద్య, వివాహం, మొదలైన విషయాలలో స్వంతగా ఆలోచించి తన ఇష్ట ప్రకారం నిర్ణయాన్ని తీసుకోగలిగిన స్థితిలో ఉండటమే సాధికారత.

మహిళ రిజర్వేషన్లు–చరిత్ర

- రాజకీయాల్లో మహిళలకు రిజర్వేషన్లు కల్పించాలని 1950లో సోషలిస్టు పార్టీ నాయకుడు రామ్ మనోహర్ లోహియా డిమాండ్ చేశారు. తర్వాత చట్ట సభలకు జరిగే ఎన్నికలలో రాజకీయ పార్టీలు 30% స్థానాలు స్త్రీలకు కేటాయించాలని 1989లో జాతీయ విధాన ప్రణాళిక (నేషనల్ ప్రాస్పెక్టివ్ ప్లాన్) సిఫార్సు చేసింది.
- 1996 సెప్టెంబర్ 12న నాటి భారత ప్రధాని దేవెగౌడ మొదటిసారిగా మహిళా రిజర్వేషన్ బిల్లును 81వ రాజ్యాంగ సవరణ రూపంలో ప్రవేశపెట్టారు. అన్ని పార్టీల మధ్య ఏకాభిప్రాయం లేక ఈ బిల్లు వీగిపోయింది. ఈ బిల్లు ద్వారా మహిళలకు అన్ని రంగాల్లో 33% రిజర్వేషన్ సౌకర్యం లభిస్తుంది. కాని సమాజ్‌వాదీ, ఆర్‌జేడీ, జనతాదళ్ యునైటెడ్ లాంటి కొన్ని పార్టీలు ఈ బిల్లును తీవ్రంగా వ్యతిరేకించాయి. ఈ బిల్లు ద్వారా అగ్రకుల మహిళలే లబ్ధి పొందుతారని, తద్వారా ఇప్పటికే వెనుకబడి ఉన్న అనేక వర్గాల మహిళల అభివృద్ధి కుంటుపడుతుందని ఆయా పార్టీల వాదన.
- కేంద్ర న్యాయశాఖా మంత్రి భరద్వాజ్ మే 6, 2008న రాజ్యసభలో మహిళా బిల్లును ప్రవేశపెట్టినా సమాజ్‌వాద్ పార్టీ సభ్యులు అడ్డుకొని మంత్రిపై దాడికి ప్రయత్నించడం మహిళా బిల్లు పట్ల నేటి పార్టీల వైఖరిని స్పష్టం చేస్తోంది.
- 1997లో ఐ.కె. గుజ్రాల్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు అన్ని పార్టీల ఆమోదంతో మహిళా బిల్లును ప్రవేశపెట్టాలని భావించారు. కానీ ఈ ప్రయత్నం విఫలమైంది.
- 1999 డిసెంబర్‌లో వాజ్‌పేయి ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ఎట్టకేలకు లోక్‌సభలో మహిళాబిల్లును ప్రవేశపెట్టారు. కాని సభలో ఈ బిల్లుపై చర్చ జరగకుండా కొన్ని పార్టీలు అడ్డుకోవడం, కొంతమంది సభ్యులు బల ప్రయోగానికి దిగడంతో ఈ బిల్లు ఆమోదం పొందలేదు.
- 2009లో మన్మోహన్ నాయకత్వంలో ఏర్పడిన సుస్థిర యుపిఏ (కాం గ్రెస్ కూటమి) ప్ర భుత్వం ఈ బిల్లును 100 రోజుల్లో చట్టంచేసి త ద్వారా మహిళలకు 33% రిజర్వేషన్ కల్పిస్తామని వెల్లడించి అందుకు అను గుణంగా క్యాబినెట్ తీర్మానం చేసింది. ఈబిల్లును మహిళా దినోత్సవం సందర్భంగా మార్చి 8 న పార్లమెం ట్‌లో ప్రవేశ పెట్టాలని నిర్ణయించారు. చివరకు 2010 మార్చి 9న రాజ్యసభ ఈ బిల్లును ఆమోదించింది. 15వ లోకసభ దీనిని ఆమోదించకుండానే 2014లో పదవీ కాలం ముగియడంతో సభ రద్దయింది.

### వివిధ దేశాల్లో మహిళా ప్రాతినిధ్యం

**2009లో ఇంటర్ పార్లమెంటరీ యూనియన్ నివేదిక ప్రకారం రువాండ 56.3 శాతం మహిళా ప్రతి నిధులతో ప్రపంచంలో ప్రధమ స్థానాన్ని ఆక్రమిం చగా, స్వీడన్ 46.4 శాతం, దక్షిణాఫ్రికా 44.5 శాతం, క్యూబా 43.2 శాతంతో అగ్రస్థానంలో ఉండగా అమెరికా 16.8 శాతం మహిళా ప్రతినిధులతో 74 వ స్థానం ఆక్రమించింది. భారత దేశం 10.7 శాతం మహిళా ప్రతినిధులను దిగువ సభకు పంపి 99వ స్థానంలో నిలిచింది.**

- యునిఫెమ్ నివేదిక ప్రకారం ప్రపంచంలో 13 దేశాల్లో మహిళలకు 30% రిజర్వేషన్లు కల్పిస్తుండగా, 25 దేశాల్లో 25-30% వరకు రిజర్వేషన్లు కల్పిస్తున్నాయి.
- న్యూజిలాండ్ 1839లో మహిళలకు ఓటుహక్కు కల్పించిన తొలిదేశంగా చరిత్రకెక్కింది.

### మన దేశంలో మహిళా ప్రాతినిధ్యం

- 1952లో మొదటి పార్లమెంట్‌లో 22 మంది (4.4%) మహిళా సభ్యులున్నారు. 1984లో 44 మంది (8.1%) మహిళలు ప్రాతినిధ్యం వహించారు. 2009 ఎన్ని కలలో పోటీ చేసిన మొత్తం అభ్యర్థుల్లో మహిళల గెలుపు శాతమే పురుషులకన్నా అధికంగా ఉంది. మొత్తం పోటీ చేసిన మహిళా అభ్యర్థుల్లో 8 శాతం మంది మహిళలు గెలుపొందగా, పురుషుల్లో 6.5 శాతం మంది విజయం సాధించారు. 2009 సార్వత్రిక ఎన్నికలలో 59 మంది మహిళలు లోక్‌సభలో, 23 మంది మహిళలు రాజ్యసభలో అడుగుపెట్టారు. 17వ లోకసభలో 543 మంది సభ్యులకు గాను 66 మంది మహిళా సభ్యులున్నారు (12 శాతం). అదే రాష్ట్రాల విషయానికి వస్తే, మహిళా సభ్యుల సంఖ్య జాతీయ సగటు పరంగా 9 శాతం మాత్రమే కావడం గమనార్హం. బీహార్, రాజస్థాన్, హర్యానాల్లో అత్యధికంగా 14 శాతం మంది మహిళ సభ్యులు ఉండగా, నాగాలాండ్, పుదుచ్చేరిల్లో ఒక మహిళా ఎంఎల్‌ఏ కూడా లేకపోవడం విచారకరం. ప్రపంచ వ్యాప్తంగా చట్టసభల్లో మహిళల ప్రాతినిధ్య సగటు 22.4 శాతం కాగా యూరప్‌లో ఇది 25.2 శాతం, సబ్ సహారాన్ ఆఫ్రికాలో 22.6 శాతం, ఆసియాలో 19 శాతం, అరబ్ దేశాల్లో 18 శాతం, నార్డిక్ దేశాల్లో 41.5 శాతం ఉంది.

| లోక్‌సభ | సంవత్సరం | మొత్తం సభ్యులు | మహిళా సభ్యులు | శాతం |
|---|---|---|---|---|
| మొదటి లోక్‌సభ | 1952 | 499 | 22 | 4.4 |
| రెండవ లోక్‌సభ | 1957 | 500 | 27 | 5.7 |
| మూడవ లోక్‌సభ | 1962 | 503 | 34 | 6.7 |
| నాల్గవ లోక్‌సభ | 1967 | 523 | 31 | 5.9 |
| ఐదవ లోక్‌సభ | 1971 | 521 | 22 | 4.2 |
| ఆరవ లోక్‌సభ | 1977 | 544 | 19 | 3.4 |
| ఏడవ లోక్‌సభ | 1980 | 544 | 28 | 5.1 |
| ఎనిమిదవ లోక్‌సభ | 1984 | 544 | 44 | 8.1 |
| తొమ్మిదవ లోక్‌సభ | 1989 | 517 | 27 | 5.2 |
| పదవ లోక్‌సభ | 1991 | 544 | 39 | 7.18 |
| పదకొండవ లోక్‌సభ | 1996 | 544 | 40 | 7.18 |
| పన్నెండవ లోక్‌సభ | 1998 | 544 | 44 | 8.8 |
| పదమూడవ లోక్‌సభ | 1999 | 544 | 49 | 9.0 |
| పద్నాల్గవ లోక్‌సభ | 2004 | 544 | 44 | 8.8 |
| పదిహేనవ లోక్‌సభ | 2009 | 544 | 59 | 10.7 |
| పదిహేడవ లోక్‌సభ | 2014 | 543 | 66 | 12.0 |

### రాష్ట్రంలో మహిళా ప్రాతినిధ్యం

1952లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు తొలి శాసనసభలో మొత్తం 140 మందిలో 6 గురు మాత్రమే మహిళా సభ్య లున్నారు. మాజీ ఆంధ్రప్రదేశ్‌లో సబితా ఇంద్రారెడ్డి హోం మంత్రి పదవిని అధిష్టించిన తొలి మహిళగా చరిత్ర సృష్టిం చారు. 2004 ఎన్నికలలో అన్ని పార్టీల నుంచి 30 మంది గెలుపొందారు.



### అడ్డంకులు

మహిళా సాధికారతకు, చట్టసభల్లో రిజర్వేషన్ల కల్పనకు సమాజంలో సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు అడ్డంకులుగా నిలుస్తున్నాయి. భారత సమాజం పురుషాధిక్యత గల సమాజం. కుటుంబంలో స్త్రీల కన్నా పురుషులకే ప్రాధాన్యం ఎక్కువగా ఉంది. కుటుంబంలో మగ పిల్లవాడికి ఇచ్చిన ప్రాధాన్యం ఆడపిల్లకు ఇవ్వడం లేదు. విద్య నందించడంలో కూడా ఆడపిల్లలను నిర్లక్ష్యం చేస్తున్నారు. వారికి పెళ్లే పరమావధిగా భావిస్తున్నారు. విద్యపై పెట్టే ధనం వృధా



వ్యయంగా భావిస్తున్నారు. ఆర్థికంగా కూడా స్త్రీకి పురుషునితో సమాన అవకాశాలు లేవు. స్త్రీలకు ఆస్థి హక్కు చట్టబద్ధంగా కల్పించినప్పటికీ అనేక సామాజిక, ఆర్థిక కారణాల వల్ల నేటికీ అమలవడం లేదు. రాజకీయ రంగంలో మహిళల పరిస్థితి ఏ మాత్రం సంతృప్తికరంగా లేదు. నేటి నేరమయ రాజకీయాలు స్త్రీలు అందులో ప్రవేశించడాన్ని నిరోధిస్తున్నాయి.

- మహిళా బిల్లు ఆమోదం పొందలేకపోవడానికి అనేక కారణాలున్నప్పటికీ పురుషాహంకారమే ప్రధాన కారణమని చెప్పవచ్చు. మహిళలకు 3వ వంతు స్థానాలను రిజర్వు చేస్తే ఆమేరకు పురుషులకు స్థానాలు తగ్గిపోతాయి. ఇది ఏ పార్టీకీ ఇష్టం లేదు. మహిళా అభ్యర్థులను కేవలం బలహీనులుగా మాత్రమే అన్ని పార్టీలు భావిస్తున్నాయి. సమాజ్‌వాది, ఆర్జేడీ వంటి పార్టీలు మహిళల ప్రయోజనాల్ని దెబ్బతీయడానికి కులపరమైన కోటా అనే అంశాన్ని తెరపైకి తెస్తున్నాయి. వారికే గనక మహిళల పట్ల సానుభూతి ఉంటే తమ పార్టీలలో మహిళలకు సబ్ కోటా అమలు చేయవచ్చు. నిజానికి గీతా ముఖర్జీ నేతృత్వంలోని పార్లమెంటరీ కమిటీ బీసీ, మైనారిటీ సబ్ కోటా మహిళా రిజర్వేషన్లలో అవసరం లేదని తన నివేదికలో పేర్కొంది.
- భారత దేశంలో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడుతుం డటం, కొన్ని పార్టీలు ఈ బిల్లును తీవ్రంగా వ్యతిరేకించడంతో 1996 నుండి నేటి వరకు 14 సంవత్సరాలుగా ఈ బిల్లుకు చట్టరూపం లభించలేదు.

### సాధికారతకు చర్యలు

#### ఐక్యరాజ్యసమితి ప్రకటన

ఐక్యరాజ్యసమితి సర్వప్రతినిధి సభ డిసెంబర్ 10, 1948న మానవ హక్కుల ప్రకటనను ఆమోదించింది. దీని ప్రకారం స్త్రీలకు స్వేచ్ఛగా జీవించే హక్కు, వివాహం చేసుకునే హక్కు, రాజ్యం నుంచి, సమాజం నుంచి రక్షణ పొందే హక్కు సమాన పనికి సమాన వేతనం పొందే హక్కు మొదలైనవి లభించాయి.

- స్త్రీల పట్ల వివక్ష నిర్మూలనను ఐక్యరాజ్యసమితి సాధారణ సమావేశం (సిడా) 18 డిసెంబర్ 1979న ఆమోదించింది. భారతదేశం సిడా ఒప్పందాన్ని 1993లో ఆమోదించింది. దీని ప్రకారం స్త్రీ, పురుష సమానత్వ సూత్రాన్ని సభ్యదేశాలు రాజ్యాంగంలో భాగంగా పొందుపరచాలి. అందుకు అవసరమైన చట్టాలు చేయాలి.
- 1995లో నాల్గవ ప్రపంచ మహిళా సదస్సు బీజింగ్‌లో జరిగింది. నాటినుండి మహిళా హక్కులపై చైతన్యం వచ్చింది. విధాన నిర్ణయంలో స్త్రీలకు ప్రాధాన్యత పెరిగింది.

### స్థానిక సంస్థల్లో మహిళా ప్రాతినిధ్యం

మనదేశంలో 1992 డిసెంబర్‌లో 73, 74 వ రాజ్యాంగ సవరణల ద్వారా స్థానిక సంస్థలలో మహిళలకు 3 వ వంతు రిజర్వేషన్లను కల్పించారు. ఫలితంగా స్థానిక సంస్థలలో విప్లవాత్మక మార్పులు వచ్చాయి. దాదాపు పది లక్షల మంది మహిళలు దేశవ్యాప్తంగా స్థానికసంస్థల్లో అధికారాన్ని కైవసం చేసుకొని ప్రజలకు, ప్రభుత్వానికి మధ్య వారధిగా నిలిచారు. స్థానిక సంస్థలలో రాజకీయ పరిణతి పొందిన మహిళలు చట్టసభలకు కూడా ఎన్నికయ్యారు. నేడు కర్ణాటక వంటి రాష్ట్రాలలో స్థానిక సంస్థలలో దాదాపు సగం మంది మహిళా ప్రతినిధులే ఉన్నారు.

మహిళా బిల్లు ఆమోదం పొందలేకపోవడానికి అనేక కారణాలున్నప్పటికీ పురుషాహంకారమే ప్రధాన కారణమని చెప్పవచ్చు. మహిళలకు 3వ వంతు స్థానాలను రిజర్వు చేస్తే ఆమేరకు పురుషులకు స్థానాలు తగ్గిపోతాయి. ఇది ఏ పార్టీకీ ఇష్టం లేదు. మహిళా అభ్యర్థులను కేవలం బలహీనులుగా మాత్రమే అన్ని పార్టీలు భావిస్తున్నాయి. సమాజ్‌వాది, ఆర్జేడీ వంటి పార్టీలు మహిళల ప్రయోజనాల్ని దెబ్బతీయడానికి కులపరమైన కోటా అనే అంశాన్ని తెర పైకి తెస్తున్నాయి.

- భారతీయ జనతా పార్టీ సంస్థాగత పదవుల్లో మూడవ వంతు మహిళలకు కేటాయించాలని నిర్ణయించింది.
- తమిళనాడులో అన్నాడియంకె సంస్థాగత పదవుల్లో మహిళలకు మూడవవంతు స్థానాలను కేటాయించింది.
- 2001ని మహిళా రాజకీయ సాధికారతా సంవత్స రంగా ప్రకటించారు.

### మహిళాబిల్లు చట్టంగా రూపొందితే...

ప్రస్తుత మహిళా బిల్లు ఆచరణలోనికి వస్తే లోక్ సభలోనూ, రాజ్యసభలోనూ మహిళా ప్రాతినిధ్యం గణ నీయంగా పెరుగుతుంది. మొత్తం పదవుల్లో మూడవవంతు మహిళలకు కేటాయిస్తారు. కనీసం 181 మంది లోక్‌సభ సభ్యులుగానూ, 83 మంది రాజ్యసభ సభ్యులుగానూ ఎన్నికౌతారు. మన రాష్ట్రం నుండి 14 మంది లోక్‌సభ సభ్య లుగా ఎన్నికౌతారు. మన రాష్ట్ర శాసనసభకు 97 మంది మహిళా సభ్యులు ఎన్నికౌతారు. ప్రభుత్వ చట్టాలు మాత్రమే సాధికారతను తీసుకు రాలేవు. జనాభాలో సగభాగంగా ఉన్న స్త్రీలను విద్యావం తులను చేసి వారికి గల న్యాయమైన హక్కులను అందిం చాలి. అప్పుడే మహిళలకు రాజకీయ సాధికారత తద్వారా సమాజ పురోగతి సాధ్యమవుతుంది. లోక్‌సభ స్పీకర్, యూపీఏ అధ్యక్షురాలు ఇలా కీలక స్థానాల్లో మహిళలే గల ప్రస్తుత తరుణంలోనైనా మహిళా బిల్లు ఆమోదానికి నోచుకుంటుందని ఆశిద్దాం.



### భారత రాజ్యాంగం - మహిళా హక్కులు

భారత రాజ్యాంగంలో మహిళల హక్కుల కోసం అనేక నిబంధనలు రూపొందించారు. మూడవ భాగంలో 14 నుండి 32 వరకు గల అధికరణలన్నీ మహిళలకు వర్తిస్తాయి. 14వ అధికరణ ప్రకారం రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా స్త్రీ, పురుషులకు సమాన అవకాశాలు కల్పించాలి. 15వ అధికరణ ప్రకారం లింగ వివక్షను నిషేధించారు. నిబంధన 15 ఎ, ఇ ప్రకారం స్త్రీల గౌరవాన్ని కించపరిచే ఏ పనీ చేయకుండా ఉండటం పౌరుని ప్రాథమిక విధి. 16వ నిబంధన ద్వారా ప్రభుత్వ నియామకాల్లో పౌరులందరికీ సమాన అవకాశాలు కల్పిస్తారు. ఆదేశ సూత్రాల్లో 39(ఎ) ప్రకారం పౌరులందరికీ అంటే స్త్రీ, పురుషులకు సమాన హక్కుల జీవనాధారం కల్పిం చాలి. అందుకు అవసరమైన విధి విధానాలు రూపొందించాలి. 73, 74 రాజ్యాంగ సవరణల ప్రకారం పంచాయితీరాజ్ వ్యవస్థ మొత్తం పదవుల్లో మూడవవంతు మహిళలకు కేటాయించాలి.



